

# శతకపద్యమంజరి

ఐదవభాగము.

## ౧ భాస్కరశతకము

శ్రీగలభాగ్యశాలిఁ గదుఁ
జేరఁగ వత్తురు తారు దారె దూ
రాగమనప్రయాసమున
కాదట నోర్చియు నైన; నిల్వ ను
ద్యోగముఁ జేసి రత్ననిల
యుం డని కాదె సమస్తవాహినుల్
సాగరుఁ జేరు టెల్ల మును
సన్నుత! మద్గురుమూర్తి! భాస్కరా!

చ. అడిగిన యట్టియాచకుల
యాశ లెఱుంగక లోభవర్తియై
కడపిన, ధర్మదేవత యొ
[illegible]

య్యెడల; న దెట్లు?—పాలు తమ
కిచ్చునె మెచ్చుటన్నైన లేఁగలన్
గుడువఁగ నీనిచోఁ గరలి
గోవులు తన్నునుగాక భాస్కరా! 2

చ. అదను దలంచి కూర్చి, ప్రజ
నాదర మొప్ప విభుండు కోరినన్,
గదిసి పదార్థ మిత్తు, రటు
గాకయు వేగమె కొట్టి తెం డనన్
మొదటికి మోసమౌఁ; బొదుఁగు
మూలము గోసిన పాలు గల్గునే
పిదికినఁగాక భూమిఁ బశు
బృందము నెవ్వరికైన భాస్కరా! 3

చ. అనఘునికైనఁ జేకుఱు న
నర్థునిఁ గూడి చరించినంతలో
మన మెరియంగ నప్పు డవ
మానము కీడు ధరిత్రియందు నే
యనువుననైనఁ దప్పదు య
థార్థము; తా నది యెట్లు లన్నచో
ఇనుమునుగూర్చి యగ్ని నల
యింపరె సమ్మెటపెట్లు భాస్కరా! 4

చ. అలఘుగుణ ప్రసిద్ధుఁ డగు
నట్టి ఘనుం డొకఁ డిష్టుఁడై తనున్
వలచి యొకించుకే మిడిన
వానికి మిక్కిలి మేలు చేయుఁగా;
తెలిసి కుచేలుఁ డొక్కకొణి
దెం డటుకుల్ దన కిచ్చినన్ మహా
ఫలదుఁడు కృష్ణుఁ డత్యధిక
భాగ్యము లాతని కీఁడె? భాస్కరా! 5

ఉ. ఉత్కృతి నర్థకాంక్ష మది
నెప్పుడు పాయక లోకు లెల్ల సం
రక్షకుఁ డైన సత్ప్రభుని
రాకలఁ గోరుదు రెందుఁ; జంద్రికా
పేక్షఁ జెలంగి చంద్రుఁ డుద
యించు విధంబునకై చకోరపుం
బక్షులు చూడవే యెదు ర
పారముదంబును బూని భాస్కరా! 6

చ. ఉరుకరుణాయుతుండు సమ
యోచిత మాత్మఁ దలంచి యుగ్రవా
క్పరుషతఁ జూపినన్ ఫలము
గల్గుట తథ్యము గాదె? యంబుదం

బుడిమిన యంతనే కురియ
కుండున వర్షము లోకరక్షణా
స్థిరతరపౌరుషంబున న
శేషజనంబు లెట్లుంగ? భాస్కరా! 7

ఉ. ఊరక వచ్చుఁ బాటుపడ
కుండిన నైన ఫలం బదృష్ట మే
పారఁగఁ గల్గు వానికిఁ; బ్ర
యాసము నొందిరి దేవదానవుల్,
వార లటుండఁగా నడుమ
వచ్చిన శౌరికిఁ గల్గెఁ గాదె శ్రీం
గారపుఁబ్రోవు లక్ష్మియును
గౌస్తుభరత్నము రెండు భాస్కరా! 8

చ. ఎడపక దుర్జనుం డొరుల
కెంతయుఁ గీడొనరించుఁ గాని యే
యెడలను మేలుసేయఁ డొక
యించుక యైనను; జీడపుర్వు దాఁ
జెడఁ దిను నింతె కాక పుడి
సెండుజలం బిడి పెంపనేర్చునే
వాడ వగుచున్న పుష్పఫల
భూరుహ మొక్కటి నైన? భాస్కరా! 9

ఉ. ఎప్పు డదృష్టతామహిమ
యించుక పాటిలు నప్పు డింపుసొం
పొప్పుచునుండుఁగాక యది
యొప్పని పిమ్మట రూపుమాయుఁగా!;
నిప్పున నంటియున్న యతి
నిర్మలినాగ్ని గురుప్రకాశముల్
దప్పిన నట్టిబొగ్గునకుఁ
దా నలు పెంతయుఁ బుట్టు భాస్కరా ! 10

ఉ. ఏగతిఁ బాటుపడ్డఁ గల
దే భువి నల్పునకున్ సమగ్రతా
భోగము భాగ్యరేఖ గల
పుణ్యునకుం బలెఁ ?; భూరిసత్త్వసం
యోగమదేభ కుంభయుగ
స్ఫోటితమాంసము నక్కకూన కే
లాగు ఘటించు ? సింహము ద
లంచినఁ జేకుఱుఁగాని భాస్కరా ! 11

ఉ. కట్టడ దప్పి తాము చెడు
కార్యముఁ జేయుచునుండి రేని దోఁ
బుట్టినవారి నైన విడి
పోవుట కార్యము; దుర్మదాంధ్యముం

దొట్టిన రావణాసురుని
 తో నెడఁబాసి విభీషణాఖ్యుఁ డా
పట్టున రాముఁ జేరి చిర
 పట్టము గట్టుకొనండె ? భాస్కరా ! 12

ఉ. కామిత వస్తుసంపదలు
 గల్గు ఫలం బొరు లాసపడ్డచో
నేమియుఁ బెట్టఁడేని సిరి
 యేఁటికి ? నిష్ఫల మున్నఁ బోయినన్;
బ్రామికపడ్డ లోకులకుఁ
 బండఁగ నే? మది యెండిపోవఁగా
నేమి ఫలంబు ? చేఁదు విడ
 దెన్నఁటికైన ముసిండి భాస్కరా ! 13

ఉ. క్రూరమనస్కు లోపతులఁ
 గొల్చి వసించిన మంచివారికిన్
వారిగుణంబె పట్టి చెడు
 వర్తన వాటిలు; మాధురీజలో
దారలు గౌతమీముఖ మ
 హానదు లంబుధిఁ గూడినంతనే
క్షారముఁ జెందవే మొదలి
 కట్టడ లన్నియుఁ దప్పి భాస్కరా ! 14

ఘనబలవత్త్వ మచ్చుపడఁ
        గల్గినవానికి హాని లేని చోఁ
దన దగుసత్త్వమే చెఱుచుఁ
        దన్ను న దెట్లన?; నీరు లావు గాఁ
గను వసియించినం జెఱువు
        కట్టకు సత్త్వము చాలకున్న చోఁ
గనుమలు పెట్టి నట్టనడి
        గండి తెగంబడకున్నె? భాస్కరా! 15

చేసినదుష్టచేష్ట నది
        చెప్పక నేర్పునఁ గప్పిపుచ్చి తా
మూసినయంతటన్ బయలు
        ముట్టక యుండదు; ద దెట్లు? రాగిపైఁ
బూసినబంగరుం జెదరి
        పోవఁగడంగిన నాఁడు నాఁటికిన్
దాసిన రాగి గానఁబడ
        దా జను లెల్ల నెఱుంగ? భాస్కరా! 16

తాలిమితోడుతం దగవు
        తప్పక నేర్పరి యొప్పు దప్పులం
బాలనసేయుఁగా, కట ను
        పాయ విహీనుఁడు సేయనేర్చునే?;

పాలును నీరు నేరుపఱు
పంగ మరాళ మెఱుంగుఁగాక వా
ర్జాల మెఱుంగు నే తదురు
చారురసజ్ఞతఁ బూన భాస్కరా! 17

చ. తెలియనికార్య మెల్లఁ గడ
తేర్చుట కొక్క వివేకిఁ జేకొనన్
వలయు వట్లైనఁ దిద్దుకొన
వచ్చుఁ, బ్రయోజనమాంద్య మేమియుం
గలుగదు; ఫాలమందు దిల
కం బిడునప్పుడు సేత నద్దముం
గలిగినఁ జక్కఁ జేసికొనుఁ
గాదె నరుం డది చూచి భాస్కరా! 18

ఉ. దానపరోపకారగుణ
ధన్యత చిత్తములోన నెప్పుడున్
లేని వివేకశూన్యునకు
లేములు వచ్చినవేళ, సంపదల్
పూనినవేళ, నొక్కసరి
పోలును; జీఁకున కర్ధరాత్రిమం
దైన నదేమి? పట్టపగ
లైన నదేమియు లేదు భాస్కరా! 19

ఉ. దానము చేయనేరని య
  ధార్మికుసంపద యుండియుండియుం
దానె పలాయనం బగుట
  తథ్యము; బూరుగు మ్రాను గాచినన్
దానిఫలంబు లూరక వృ
  థా పడిపోవవె యెండి గాలిచేఁ
గానలలోన నేమిటికిఁ
  గాక యభోజ్యము లౌట భాస్కరా! 20

చ. నొగిలినవేళ నెంతటి ఘ
  నుండును దన్నొక రొక్కఁ జేర్పఁ బో
దగపడి పోదిసేయక త
  నంతట బల్మికి రాఁడు, సిక్కమే;
జగమున నగ్నియైనఁ గడు
  సన్నగిలంబడియున్న నింధనం
బెగయఁగఁ ద్రోచి యూఁదక మ
  హెచ్చు రవుల్కొననేర్చు భాస్కరా! 21

ఉ. పండితులైనవారు దిగు
  వం దగ నుండఁగ నల్పుఁ డొక్కఁ డు
ద్దండతఁ బీఠ మెక్కిన బు
  ధప్రకరంబుల కేమి యెగ్గగుఁ?;

గొఁడొకకోఁతి చెట్టుకొన
కొమ్మలనుండఁగఁ గ్రింద గండభే
రుండమదేభ సింహనికు
రుంబము లుండవె? చేరి భాస్కరా! 22

చ. పలుమఱు సజ్జనుండు ప్రియ
భాషలు పల్కుఁ గఠోరవాక్యముల్
పలుకఁ డొకానొకప్పు డవి
పల్కినఁ గీడును గాదు నిక్కమే;
చటుకున వచ్చి మేఘుఁ డొక
జాడను దా వడగండ్ల రాల్చినన్
శిల లగునోటు! వేగిరమె
శీతలనీరము గాక; భాస్కరా! 23

ఉ. పూనినభాగ్యరేఖ చెడి
పోయినపిమ్మట నెట్టిమానవుం
డైనను వాని నెవ్వరుఁ బ్రి
యంబునఁ బల్కరు పిల్వ రెచ్చటం
దా నది యెట్లొకో యనినఁ
దథ్యము పుష్పము వాడి వాసనా
హీనత నొంది యున్న యెడ
నెవ్వరు ముట్టుదురయ్య? భాస్కరా! 24

ఉ. బంధుర సద్గుణాఢ్యుఁ డొక
పట్టున లంపట నొందియైన దు
స్సంధి దలంపఁ డన్యులకుఁ
జాల హితం బొనరించుఁగాని; శ్రీ
గంధపుఁజెక్క రాగిలుచుఁ
గావె శరీరుల కుత్సవార్థ మై
గంధము లొస్గఁ బుట్టఁ దఱుఁ
గంబడియుండుట లెల్ల భాస్కరా! 25

ఉ. మానవుఁ డాత్మ కిష్ట మగు
మంచిప్రయోజన మాచరించుచోఁ
గానక యల్పుఁ డొక్కఁ డది
గా దని పల్కిన వానిపల్కకై
మానఁగఁ జూడఁ డావని; స
మంచితభోజనవేళ నీఁగ గా
లూనిన వంటకంబు దిన
కుండఁగ నేర్పగునోటు! భాస్కరా! 26

ఉ. లోను దృఢంబు గాని పెను
లోభిని నమ్మి యసాధ్యకార్యముల్
కానక పూనునే నతఁడు
గ్రక్కునఁ గూలును; నోటిపుట్టిపై

మానవుఁ డెక్కిపోవ నొక
మాటు బుటుక్కన ముంపకుండునే
తా నొకలోఁతునం గెడసి
దానిఁ దరింపఁగలేక భాస్కరా! 27

చ. వలనుగఁ గానలందు ప్రతి
వర్షమునం బులి నాలుగైదు పి
ల్లలఁ గను, దూడ నొక్కటి ని
లం గను ధేనువు రెండుమూఁడునేఁ
డుల, కటులైన బెబ్బులికు
టుంబము లల్పము లాయె, నాలమం
దలు గడు వృద్ధిచెందవె య
ధర్మము ధర్మముఁ దెల్ప భాస్కరా! 28

ఉ. వానికి విద్యచేత సిరి
వచ్చె నటంచును విద్య నేర్వఁగాఁ
బూనినఁ బూనుఁగాక తన
పుణ్యము చాలక భాగ్యరేఖకుం
బూనఁగ నెవ్వఁ డోపు?; సరి
పో, చెవి పెంచును గా కదృష్టతా
హీనుఁడు కర్ణభూషణము
లెట్లు గడింపఁగ నోపు? భాస్కరా! 29

ఉ. సంతతపుణ్యశాలి నొక
జాడను సంపద వాసిపోయి తా
నంతటఁ బోక నెట్టుకొని
యప్పటియట్ల వసించియుండు; మా
సాంతమునందు చందురుని
నన్నికళల్ పెడఁబాసి పోయినం
గాంతి వహింపఁడోటు తిరు
గంబడి దేహము నిండ భాస్కరా! 30

ఉ. సారవివేకవర్తనల
నన్నుతి కెక్కినవారిలోపలం
జేసినయంత మూఢులకుఁ
జేపడ దానడ, యెట్టు లన్నఁ గా
సారములోన హంసముల
సంగతి నుండెడికొంగపిట్ట కే
తీరునఁ గల్గనేర్చును ద
దీయగతుల్ దలపోయ భాస్కరా! 31

చ. సిరి గలవాని కెయ్యెడలఁ
జేసినమే లది నిష్ఫలం బగుఁ
నెఱి గుఱి గాదు, పేదలకు
నేర్పునఁ జేసిన సత్ఫలం బగుఁ;

వఱపున వచ్చి మేఘుఁ డొక
వర్షము వాడినచేలమీఁదటం
గుఱిసినఁగాక యంబుధులఁ
గుర్వఁగ నేమిఫలంబు? భాస్కరా! 32

చ. స్థిరతరధర్మవర్తనఁ బ్ర
సిద్ధికి నెక్కినవాని నొక్కము
ష్కరుఁ డతినీచవాక్యములఁ
గా దని పల్కిన నమ్మహాత్ముఁడుం
గొఱఁత వహింపఁ డయ్యెడ; న
ఖండితపూర్ణసుధాపయోనిధిలో
నరుగుచుఁ గాకి రెట్ట యిడి
నంతన నేమికొఱంత భాస్కరా! 33

ఉ. సేనగ వాంఛితాన్నము భు
జింపఁ గలప్పుడు గాక లేనిచో
మేనులు డస్సియుంట నిజ
మే కద దేహుల; కగ్నిహోత్రుఁ డా
నే నిజభోజ్యముల్ గుడుచు
నేనియుఁ బుష్టి వహించు లేనినాఁ
డూని విభూతిలో నడఁగి
యుండఁడె తేజము దప్పి భాస్కరా! 34

ఉ. హాళి నిజప్రబుద్ధి తిర
మైనవిధంబునఁ బెట్టుబుద్ధు లా
వేళల కంతె కాని మఱి
వెన్కకు నిల్వవు, హేమకాంతి యె
న్నాళుల కుండుఁ గాని యొక
నాఁడు పదంపడి సానఁబట్టినం
దాళుక యుండునే యినుప
తాటకుఁ జాయలు పోక భాస్కరా! 35

ఉ. ఇంచుక నేర్పు చాలక వి
హీనతఁ జెందిన నాకవిత్వమున్
మించు వహించె నీకతన
మిక్కిలి; యెట్లనఁ, దోలుబొమ్మలన్
మంచివివేకి వాని తెర
మాటున నుండి ప్రశస్తరీతి నా
డించిన నాడవే జనుల
డెందము నింపవె ప్రీతి భాస్కరా! 36

క. అమ్మా! లక్ష్మీ నమస్కా
రమ్ములు గావించి నిన్నుఁ బ్రార్థించెద నా
నెమ్మదిలో విద్యారూ
పమ్మున నేలుకొను ముఖ్య ఫల మదియ కదా! 1

ఉ. విద్య నిగూఢగుప్త మగు
విత్తము రూపము పూరుషాళికిన్
విద్య యశస్సు భోగకరి
విద్య గురుండు విదేశబంధుఁడున్
విద్య విశిష్టదెవతము
విద్యకు సాటి ధనంబు లే దిలన్
విద్య నృపాలపూజితము
విద్య నెఱుంగనివాఁడు మర్త్యుఁడే? 2

చ. సకలకళావిభూషితులు
శబ్దవిదుల్ నయతత్త్వబోధకుల్
ప్రకటకవీంద్రు లేన్నృపతి
వజ్జను నిర్ధనులై చరింతు రా
వికృతపు జాడ్య మా దొరది
విత్తము లేకయ వారు పూజ్యు; లం
ధక జనమాషితంబులు ఘ
నంబులు గావె యమూల్యరత్నముల్? 3

ఉ. భూషలు గావు మర్త్యులకు
భూరిమయాంగద తారహారముల్
భూషిత కేశపాశ మృదు
పుష్పసుగంధ జలాభిషేకముల్
భూషలు గావు పూరుషుని
భూషితుఁ జేయు పవిత్రవాణి వా
గ్భూషణమే సుభూషణము
భూషణముల్ నశియించు నన్నియున్. 4

ఉ. హార్తకుఁ గాదు గోచర మ
హార్నిశమున్ సుఖపుష్టి సేయు స
త్కీర్తి ఘటించు విద్య యను
దివ్యధనం బఖిలార్థికోటికిం
బూర్తిగ నిచ్చినం బెరుఁగుఁ
బోదు యుగాంతపు వేళనైన భూ
భర్తలు దద్ధనాధికుల
పట్టునఁ గర్వము మాను టొప్పగున్. 5

మ. యతి సంసక్తిని; బాలుఁ డాదరముచే;
జ్యాభర్త దుర్మంత్రిచే;
శ్రుతిహీనిర్ద్విజుఁ; డన్వయంబు ఖలుచేఁ;
గ్రూరాప్తిచే శీల; ము

ద్ధతిచే మిత్రత; చూపులేమిఁ గృషి; వి
ద్యప్రాప్తిచే సిగ్గు; దు
ర్మతిచే సంపదలున్ నశించుఁ జెడు న
ర్థంబుల్ ప్రమాదంబునన్. 6

చ. కరమున నిత్యదానము, ము
ఖంబున సూనృతవాణి; యాఁదలం
గురుచరణాభివాదన; మ
కుంఠితవీర్యము దోర్యుగంబునన్;
వరహృదయంబునన్ విశద
వర్తన; మంచితవిద్య వీనులన్;
సురుచిరభూషణంబు లివి
శూరులకున్ సిరిలేనియప్పుడున్. 7

చ. నతు లగుచున్ మహోన్నతిఁ ద
నర్చుచు నన్యగుణోక్తిచే గుణో
న్నతిఁ బ్రకటించుచుం బర జ
నప్రియ కార్యసమర్థతన్ సమం
చితనిజకార్యసంగ్రహముఁ
జేయుచు నిష్ఠురవాదులన్ క్షమా
ధృతి నిరసించుచుం బరగు
ధీరులు పూజ్యులుగారె యేరికిన్? 8

మ. తమకార్యంబుఁ బరిత్యజించియుఁ బరా
ర్థప్రాపకుల్ సజ్జనుల్
దమకార్యంబు ఘటించుచుం బరహితా
ర్థవ్యాపృతుల్ మధ్యముల్
దమకై యన్యహితార్థఘాతుకజనుల్
దైత్యుల్ వృథాన్యార్థభం
గము గావించెడువార లెవ్వరో యెఱుం
గన్ శక్యమే యేరికిన్? 9

ఉ. క్షీరము మున్ను నీటికొసఁ
గెన్ స్వగుణంబులు దన్నుఁ జేరుటన్,
క్షీరము దప్త మౌటఁ గని
చిచ్చుఱికెన్ వెతచే జలంబు, దు
ర్వార సుహృద్విపత్తిఁ గని
వహ్నిఁ జొరంజనె దుగ్ధ, మంతలో
నీరముఁ గూడి శాంత మగు,
నిల్చు మహాత్ములమైత్రి యీగతిన్. 10

చ. హృదయవచశ్శరీరముల
నెంతయుఁ బుణ్యసుధాప్రపూర్ణులై
ముదము బహూపకారముల
మూఁడుజగంబులకున్ ఘటించుచున్

వదలక సాధుసద్గుణ ల
వంబులు గొండలు సేసి మెచ్చుచున్
మదిని వికాసయుక్తులగు
మాన్యులు గొందఱు వొల్తు రిద్ధరన్ 11

శా. ఆరంభింపరు నీచమానవులు వి
ఘ్నాయాససంత్రస్తులై
యారంభించి పరిత్యజింతు రురువి
ఘ్నాయత్తులై మధ్యముల్
ధీరుల్ విఘ్ననిహన్యమానులగుచున్
ధృత్యున్నతోత్సాహులై
ప్రారబ్ధార్థము లుజ్జగింపరు సుమీ
ప్రజ్ఞానిధుల్ గావునన్. 12

శా. నీతిప్రౌఢవిహారులైన నిపుణుల్
నిందింప నీ మెచ్చ నీ
ఖ్యాతిం జెందిన సంపదల్ నిలువనీ
గాఢంబుగా సాగనీ
ఘాతం బప్పుడ పొందనీ నియతిమైఁ
గానీ యుగాంతంబునన్
నీతిశ్లాఘ్యపథంబు దప్పరు గదా
నిత్యంబు ధీసత్తముల్. 13

చ. ఉరుతరపర్వతాగ్రమున
నుండి దృఢంబగు ఱాతిమీఁద స
త్వరముగఁ ద్రెళ్ళి కాయము హ
తంబుగఁ జేయుట మేలు గాలిమే
పరిదారవాతఁ గేలిడుట
బాగు హుతాశనమధ్యపాతముం
బర మగుఁ జారుశీలగుణ
వర్జన మర్హము గాదు చూడఁగన్. 14

చ. అతనికి వార్ధి కుల్య యగు
నగ్ని జలం బగు మేరుశైల మం
చితశిలలీల నుండు మ
దసింహము జింక తెఱంగుఁ దాల్చుఁ గో
పితఫణి పూలదండ యగు
భీష్మవిషంబు సుధారసం బగున్
క్షితి జనసమ్మతం బగును
శీల మదెవ్వనియందు శోభిలున్! 15

ఉ. జానగు భూతికిం దొడవు
సజ్జనభావము, శౌర్యలక్ష్మికిన్
మానము; నీతి విద్యకు, శ
మంబు సుబుద్ధికి, విత్తవృద్ధికిన్

దానము, దాల్మి శక్తికిని,
ధర్మనిరూఢి కదంభవృత్తియుం
బూనికతోడ సర్వగుణ
భూషణ మెన్నఁగ శీలమేసుమీ, 16

చ. దొసఁగులు వచ్చువేళ గుణ
ధుర్యుల ధైర్యగుణంబు సర్వము
బసచెడ దంచుఁ జూచెదవు
పాపపు దైవమ! యోదురాగ్రహా
వ్యసనము మాను మాను పరి
యంబున వీతనిజక్రమంబు లై
పసి సెడ వించుకంతయును
సాగరముల్ కులపర్వతంబులున్. 17

ఉ. మకర ముఖాంతరస్థ మగు
మానికముం బెకలింపవచ్చుఁ బో
యొకచలదూర్మికానికర
మైన మహోదధి దాఁటవచ్చు మ
స్తకమునఁ బూవుదండ వలె
సర్పము నైన ధరింపవచ్చు మ
చ్చిక ఘటియింప మూర్ఖజన
చిత్తముఁ దెల్ప నసాధ్య మేరికిన్ 18

చ. క్షమ కవచంబు, క్రోధ మది
శత్రువు, జ్ఞాతి హుతాశనుండు, మి
త్రము దగుమందు దుర్జనులు
దారుణపన్నగముల్ సువిద్య వి
త్త ముచితలజ్జ భూషణము
చారుకవిత్వము రాజ్య మీక్షమా
పరిముఖపదార్థముల్ గలుగ
పట్టునఁ దత్కవచాదు లేటికిన్. 19

శా. హ్రీరమ్యుం జడుఁ గాఁగ; సువ్రతుని మా
యుం గా, శుచిం దంభిఁ గా,
శూరున్ నిర్దయుఁ గా, మునిన్ విమతిఁ గా,
శ్రోత్రప్రియాలాపు ని
స్సారుం గా, బలవంతు గర్వితునిఁ గా,
సద్వక్త వాచాలుఁ గాఁ
గ్రూరుం డన్ని సుధీగుణంబు దురితా
రూఢంబుఁ జేయుం గదా! 20

---

## 3 దాశరథిశతకము.

ఉ. శ్రీరమణీయహార యత
సీకుసుమాభశరీర భక్తమం
దార వికారదూర పర
తత్త్వవిహార త్రిలోక చేతనో
ద్ధార దురంతపాతకవి
తానవిదూర ఖరారిదైత్యకాం
తారకుఠార భద్రగిరి
దాశరథీ! కరుణాపయోనిధీ!

చ. అగణితసత్యభాష శర
ణాగతపోష దయాలసజ్ఝరీ
విగతసమస్తదోష పృథి
వీసురతోష త్రిలోకపూత కృ
ద్గగనధునీమరందపద
కంజవిశేష మణిప్రభాధగ
ద్ధగితవిభూష భద్రగిరి
దాశరథీ! కరుణాపయోనిధీ!

ఉ. రంగదరాతిభంగ ఖగ
రాజతురంగ విపత్పరంపరో
త్తుంగతమఃపతంగ పరి
తోషితరంగ దయాంతరంగ స

పిలిచిన బల్క వింత మఱు

పే నరుఁ డిల్లనరాదుగాక నీ

తలఁపున లేదె సీత చెఱ

దాశరథీ! కరుణాపయోనిధీ! 8

చ. జనవర మీకథాళి విన

సైపక కర్ణములందు ఘంటికా

నినదవినోదము ల్సలుపు

నీచునకున్ వరమిచ్చినావు ని

న్ననయము నమ్మికొల్చిన మ

హాత్ముల కేమి యొసంగెదో సనం

దననుత! మా కొసంగు దయ

దాశరథీ! కరుణాపయోనిధీ! 9

చ. సలలిత రామనామ జప

సార మెఱుంగఁగఁ గాశికాపురీ

నిలయుఁడఁ గాను మీచరణ

నీరజరేణు మహాప్రభావముం

దెలియ నహల్యఁ గాను జగ

తీధవ, నెమ్మది నీమహాత్త్వముం

దలఁచి నుతింప నాతరమె

దాశరథీ! కరుణాపయోనిధీ! 10

ఉ. పాతకులైన, మీకృపకు
పాత్రులుగారె తలంచి చూడఁ జ
ట్రాతికిఁ గల్గె స్త్రీత్వము, న
రాతికి రాజ్యసుఖంబుఁ గల్గె దు
ర్జాతికిఁ బుణ్య మబ్బెఁ గపి
జాతి మహత్త్వము నొందెఁ గావునం
బాతక మెట్టివారలకు
దాశరథీ! కరుణాపయోనిధీ! 11

ఉ. నీసహాజంబు సాత్త్వికత
నీవిడిపట్టు సుధాపయోధి ప
ద్మాసనుఁ డాత్మజుండు గమ
లాలయ నీప్రియురాలు నీకు సిం
హాసన మిద్ధరిత్రి గొడు
గాకస మక్షులు చంద్రభాస్కరుల్
నీసుఖతల్ప మాదిఫణి
నీవె సమస్తము, గొల్చినట్టి నీ
దాసులభాగ్య మెట్టిదయా!
దాశరథీ! కరుణాపయోనిధీ! 12

చ. దురితలతానుసారి భవ
దుఃఖ కదంబము రామనామ ధీ

తృంగ ధరాత్మజాహృదయ
సారసభృంగ నిశాచరాబ్జమా
తంగ శుభాంగ భద్రగిరి
దాశరథీ! కరుణాపయోనిధీ! 3

ఉ. శ్రీద సనందనాదిముని
సేవితపాద దిగంతకీర్తిసం
పాదితసుప్రసాద భవ
పాశవిచ్ఛేద విషాదవల్లికా
చ్ఛేద ధరాధినాథకుల
సింధుసుధామయపాద నృత్తగీ
తాదివినోద భద్రగిరి
దాశరథీ! కరుణాపయోనిధీ! 4

ఉ. దురితలతా లవిత్ర ఖర
దూషణకాననవీతిహోత్ర భూ
భరణకళావిచిత్ర భవ
బంధవిమోచనసూత్ర చారువి
స్ఫురదరవిందనేత్ర ఘన
పుణ్యచరిత్ర వినీలభూరికం
ధరసమగాత్ర భద్రగిరి
దాశరథీ! కరుణాపయోనిధీ! 5

ఉ. దారుణ పాతకాబ్ధికి స
దా బడబాగ్ని భవాకులార్తి వి
స్తార దవానలార్చికి సు
ధారసవృష్టి దురంతదుర్మతా
చారభయంకరాటవికి
చండకఠోరకుఠారధార నీ
తారకనామముం దలఁతు
దాశరథీ! కరుణాపయోనిధీ! 6

చ. హలకులిశాంకుశ ధ్వజ శ
రాసన శంఖ రథాంగకల్పకో
జ్జ్వల జలజాత రేఖలను
సాంకములై కనుపట్టుచున్న మీ
కలితపదాంబుజ ద్వయము
గౌతమపత్ని కొసంగినట్లు నా
తలఁపునఁ జేర్చి కావఁగదె
దాశరథీ! కరుణాపయోనిధీ! 7

చ. కలియుగ మర్త్యకోటి నినుఁ
గన్గొనరాని విధంబొ భక్తవ
త్సలత వహింపవో చటుల
సాంద్రవిపద్దశవార్ధిఁ గ్రుంకుచోఁ

మంతన మెట్టిదో యుదుత
    మైని గరాగ్ర నఖాంకురంబులన్
సంతత మందఁ జేసితివి
    సత్కులజన్మము లేమిలెక్క వే
దాంతముగాదె నీమహిమ
    దాశరథీ! కరుణాపయోనిధీ! 18

ఉ. బొంకనివాఁడె యోగ్యుఁ డరి
    పోరికి నెత్తినచోటఁ జివ్వకున్
జంకనివాఁడె జోదు రథ
    సంబున నర్థికరంబు సాఁచినం
గొంకనివాఁడె దాత మిముఁ
    గొల్చి భజించిన వాఁడె పో నిరా
తంక మనస్కుఁ డెన్నఁగను
    దాశరథీ! కరుణాపయోనిధీ! 19

చ. తరువులు పూచి కాయలగు తత్కుసుమంబులు పూజగాభవ
చ్చరణము సోఁకి దాసులకు సారములై ధనధాన్యరాసులై
కరి భట ఘోట కాంబర నికాయములై విరజానదీ సము
త్తరణ మొనర్చు చిత్రమిది దాశరథీ! కరుణాపయోనిధీ! 20

---

## ౪ భారతనీతులు

క. సత్యాకృతు లగు గుణములు
నిత్యానుష్ఠిత సమగ్ర నిర్మలయోగ
స్థిత్యభిముఖునకు సులభము
లత్యంత సుఖప్రవత్తంబు లవి కార్యంబుల్. 1

చ. కుదురు సమస్తధర్మముల
కున్ విను సత్యము యోగ మోక్ష స
త్ప్రదములు సత్యవాక్యములు
పాప మసత్యము కంటె నొండు లే
దు దలఁప నశ్వమేధములు
దొమ్మిదినూఱులు వెండి నూఱునై
యొదవిన నీడుగావు భర
తోత్తమ! సత్యముతోడ నారయన్. 2

ఆ. ధర్మ మెఱిఁగి దానిఁ దా నొండుగా లాభ
లోభ పక్షపాత లోలబుద్ధి
సభల నెవ్వఁడేని సభ్యుఁడై పలుకు వాఁ
డనృతదోషఫలము ననుభవించు. 3

క. ఒలసి మనోవాక్కాయం
బుల ద్రోహభావ మఖిల భూతములయెడం
గలిమి విను శీల మది మే
లొలయించును దాన నుల్ల మూన్పును పుత్త్రా. 4

ఖరతరహేతిచేఁ దెగి చ
కాచకలై చనకుండ నేర్చునే
దరికొని మండుచుండు శిఖ
దార్కొనినట్టి శలభాదికీటకో
త్కరములు లీనమై చనవె
దాశరథీ! కరుణాపయోనిధీ! 13

ఉ. వనకరి చిక్కె మైనసకు,
వాచవికిం జెడిపోయె మీను, తా
వినికికిఁ జిక్కెఁ జిల్వ, గను
వేదుఱు చెందె నుసిళ్లు, తావిలో
మనికి నశించె తేఁటి తర
మా యిరుమూఁటిని గెల్వ నైదుసా
ధనముల నీవె కావ నగు
దాశరథీ! కరుణాపయోనిధీ! 14

చ. సిరి గలనాఁడు మైమఱచి
చిక్కిననాఁడు దలంచి పుణ్యముల్
పొరిఁబొరిఁ జేయ నైతి నని
పొక్కినఁ గల్గునె? గాలి చిచ్చుపైఁ
గెరలినవేళ దప్పిగొని
కీడ్పడువేళ జలంబు గోరి త

త్రజమునఁ ద్రివ్వనం గల[illegible]
దాశరథీ! కరుణాపయోనిధీ! 15

చ. సరసుని మానసంబును ర
సజ్ఞుఁ డెఱుంగును ముష్కరాధముం
డెఱిఁగి గ్రహించువాఁడె కొల
నేకనివాసము గాఁగ దర్దురం
బరయఁగ నేర్చు నెట్లు విక
చాబ్జమరందరసైక సౌరభో
త్కరము మిళింద మొందు క్రియ
దాశరథీ! కరుణాపయోనిధీ! 16

ఉ. శ్రీరఘువంశతోయధికి
శీతమయూఖుఁడ వైన నీ పవి
త్రోరుపదాబ్జము ల్వికసి
తోత్పల చంపకవృత్త మాధురీ
పూరిత వాక్ప్రసూనములఁ
బూజ లొనర్చెదఁ జిత్తగింపుమీ
తారకనామ భద్రగిరి
దాశగథీ! కరుణాపయోనిధీ! 17

ఉ. ఎంతటి పుణ్యమో శబరి
యెంగిలి గొంటివి వింత గాదె నీ

క. క్షమ గలవానికిఁ బృథ్వీ
సమునకు నిత్యంబు విజయ సంసిద్ధి యగున్
క్షమి యైనవాని భుజ వి
క్రమము గదర వెలయు సర్వకార్య క్షమమై. 5

క. క్షమలేని తపసితపమును
బ్రమత్తు సంపదయు ధర్మబాహ్యప్రభురా
జ్యము భిన్నకుంభమునఁ దో
యములట్టుల యధ్రువంబు లగు నివి యెల్లన్. 6

ఆ. ఎఱుక గల మహాత్ముఁ డెఱుక యన్జలముల
నార్పుఁ గ్రోధ మను మహానలంబుఁ
గ్రోధవర్జితుండు గుఱుకొని తేజంబుఁ
దాల్చు దేశకాల తత్త్వ మెఱిఁగి. 7

చ. ధనపతితోఁ దరిద్రునకుఁ
దత్త్వవిదుం డగు వానితోడ మూ
ఢునకుఁ బ్రశాంతుతోడఁ గదుఁ
గ్రూరునకున్ రణశూరుతోడ భీ
రునకు వరార్థితోడ నవి
తార్థికి సజ్జనుతోడఁ గష్ట దు
ర్జనునకు నెవ్విధంబునను
సఖ్యము పొసాడఁగూడ నేర్చునే. 8

క. ఇచ్చునది ధనము పాత్రున
కచ్చుగ నొరు వేఁడ కుండు నది యభిముఖులై
వచ్చిన యాశార్థుల వ్యథ
పుచ్చక సేయునది సర్వభూత ప్రీతిన్. 9

క. తన కిమ్మగునంతకు దు
ర్జనుఁ డిష్టుఁడ పోలె నుండి సర్వము పోలెం
దన కిమ్మగుడును గఱచును
ఘనదారుణకర్మ గరళ ఘన దంష్ట్రలచేన్. 10

క. విను లోభము నజ్ఞానం
బును సదృశఫలప్రదములు; పుట్టును లోభం
బున నజ్ఞానము గావున
జననాయక! లోభ ముడుగ సౌఖ్యము లొందున్. 11

క. అది సర్వదోషముల కా
స్పద మది దురితక్రియానుబంధంబులకున్
మొదలు నిరంతరదుఃఖ
ప్రద మని మది నెఱిఁగి తృష్ణఁ బాతురు సుమతుల్. 12

ఆ. పునుకఁ గుక్కతిత్తిఁ బోసినపాలు నీ
ళ్ళధికనిందఁ బొరయునట్లు దుష్ట
మై యపాత్రవిషయ మగు నీగి వృథపోవు
నిచ్చుచోటఁ బాత్ర వెఱుఁగవలయు. 13

క. ప్రజ్ఞయ ప్రతిష్ఠ లాభము
ప్రజ్ఞయ నాకం బనంగఁ బ్రజ్ఞయ మవ్వే
ప్రజ్ఞయ కైవల్యంబును
బ్రజ్ఞాసాధ్యములు గాని పనులుం గలవే. 14

క. మనమునకుఁ బ్రియంబును హిత
మును బథ్యముఁ దథ్యమును నమోఘము మధురం
బును బరిమితమును నగుపలు
కొనరఁగఁ బలుకునది ధర్మయుతముగ నఖిలన్. 15

తే. తగినవేషంబు దనుఁ దాన పొగడుకొనమి
నొచ్చియును గీడు పలుకమి యిచ్చి నగవ
కునికి దనకెంత నడవళ యున్నఁ బథముఁ
దప్ప కుండుట నడవడి కొప్పు సేయు. 16

తే. చల్లియుండియు సైరణసేయు నతఁడుఁ
జేవవడియును నర్థికిఁ బ్రియముతోడఁ
దనకుఁ గల భంగి నిచ్చు నతండుఁ బుణ్య
పురుషు లని చెప్పి రార్యులు బుధవరేణ్య! 17

ఆ. పగయ కలిగెనేని పా మున్నయింటిలో
నున్నయట్లకాదె? యూరఁబల్లి
యుండునట్లు చిత్త మొకమాటుఁ గావున
వలవ దధికదీర్ఘ వైరవృత్తి. 18

# * పతివ్రతాధర్మములు

(ద్రౌపది సత్యభామకుఁ దెల్పినవి.)

చ. పతిఁ గడవంగ దైవతము
భామల కెందును లేదు ప్రీతుఁడై
పతి కరుణించెనేనిఁ గల
భాషిణి భాసురభూషణాంబరా
న్విత ధనధాన్యగౌరవము
విశ్రుతసంతతియున్ యశంబు స
ద్గతియును గల్గ నొందు మయిఁ
గల్గునె యిన్ని తెఱంగు లారయన్. 1

ఆ. కరము దుఃఖపడినఁగాని యొక్కింతసౌ
ఖ్యంబు ధర్మగతియుఁ గలుగ దొందుఁ
జూడు మబల ధర్మ్యశుశ్రూషఫలము సం
తతసుఖంబు సంద ధర్మ మొదవు. 2

క. కావున నిత్యము సమ్య
గ్భావము ప్రేమంబు వెరవు భక్తియుఁ బ్రియము౦
గావింపుము నీప్రియునెడ
భావ మెఱిఁగి యతఁడు దాన పాలించు దయన్. 3

ఉ. వనజాక్షుండు గడంగి నీదగుగృహ
ద్వారంబు సేరంగ న

ప్పి ననంగా విని తెమ్ము సంభ్రమమ్ముతోఁ
జెన్నొందు నభ్యంతరం
బునకుఁ వచ్చిన నాసనాదికరణం
బుల్ దీర్పఁ దత్పూజనం
బు నియోగించితి నంచు నుండక ప్రియం
బుల్ సేయు మీవుం దగన్. 4

౫. కులసతులును సతులును ని
ర్మలమతులును నైనయట్టి మగువలతోడం
జెలిమి యొనరించునది దు
ర్విలసితవనితాభియుక్తి విడువుము తరుణీ! 5



# ౬. విచిత్రపద్యములు

ఆ. వంగతోఁట నుండు వరిమళ్లలో నుండు
జొన్నచేల నుండుఁ జోద్యముగను
తలుపుమూలల నుండు తలమీఁద నుండును
దీనిభావ మేమి? తిరుమలేశ! 1

(వంగ=వంగచెట్టు, తోఁటన్=(వంగ)తోఁటయందే, ఉండును. వరి=వరిపైరు, మళ్లలోన్=(వరి)మళ్ళలోనే; ఇట్లే జొన్న—చేల యందే, తలుపు—మూలయందే, తల—మీఁదనే ఉండునని చమత్కారము.

గీ. చనినవెనుకను రాకుండు జంట యేదో?
వచ్చినను జనకుండు వ్యవస్థ లేవో?
వచ్చుచును బోవుచుండు నవస్థ లేవో?
తెలిసికొని వీనిఁ దెల్పుమా తెల్లముగను. 2

( కీర్తి-అపకీర్తి; పుణ్యము-పాపము; కలిమి-లేమి.)

# లఘుటీక.

## భాస్కరశతకము

పద్యము 1. తారు దారె=తమంతటఁ దామే, దూర+ఆగమన+ప్రియాసమునకున్=దూరమునుండి వచ్చుటవలననైన కష్టమునకు; ఆదటన్=ప్రియముతో; వాహినుల్=నదులు; సాగరున్=సముద్రుని, 2. కెరలి=కోపించి (ఎగిరిపడి), 3. కూర్చి=ప్రేమించి, 5 అలఘు=తక్కువగాని; కొనిదెందు=చేరెఁడు, (కొనిదిలి+ఎఁడు) 9. భూరుహము=చెట్టు. 11, భూరి సత్త్వ... మాంసము—భూరి=అధికమైన, సత్త్వ=బలముయొక్క, సంయోగ=కూడికచేత (నైన) మద+ఇభ=మదముగల యేనుఁగుయొక్క, కుంభయుగళ=కుంభస్థలముల జంటనుండి, ఉత్థిత=పుట్టిన,మాంసము, 12. దౌర్మదాంధ్యమున్=చెడ్డమదమువలనఁగలిగిన గుడ్డితనము. 13. భ్రామికపడ్డ=భ్రమపడిన. 14. మాధురీజల+ఉదారలు=తియ్యనీటి నిచ్చునవి, గౌతమీముఖ=గోదావరి మొదలైన, క్షారము=ఉప్పన. 15. ఘనబలవత్త్వము=గొప్పబలము గలిగియుండుట, సత్త్వము=బలము, కట్ట=గట్టు. 16. బయలుముట్టు=వెల్లడిలోనికి వచ్చు. 17. మరాళము=హంస, తత్+ఉరు చారు రసజ్ఞత=దానియొక్క గొప్పదైనదియు మనోహరమైనదియు నగు రసమును తెలిసికొను తెలివి. 19. చీఁకు=గుడ్డి. 20. అభోజ్యములు=తినఁదగనివి. 21. ప్రోదిచేయక=రక్షింపక. 21. ఇంధనంబు=కట్టె (పుల్ల). 22. నికురంబములు=సమూహములు. 25. బంధుర=ఒప్పిదమైన, లంపట=ఆపద, దుస్సంధి=అనిష్టమును. 27. ఓటిపుట్టి=బీటలువాఱిన (రేవు దాటించు) దోనె. కెడసి=అడుగుభాగమునఁ బడిపోయి. 28.

వర్షము=సంవత్సరము, ధేనువు=ఆవు. 31. కాసారము=సరస్సు, తదీయగతుల్=దానినడకలు. 32. జలఘనర్తున్=వాన కలదైన కాలమునందు. 33. ముష్కరుఁడు=వంకరనడవడి గలవాఁడు, అకుంఠిత పూర్ణసుధాపయోధిలోన్=మొక్కవోని నిండిన పాల సముద్రములోపల. 34. సేనగన్=చాలఁగా, దేహులకున్=శరీరము గలవారికి (మనుష్యులకు), విభూతి=బూడిద. 35. నిజప్రబుద్ధి=స్వభావమువలనఁ గలిగిన గొప్పతెలివి, తిరము=స్థిరము, పెట్టుబుద్ధి=(తెచ్చి)పెట్టిన తెలివి, హేమకాంతి=బంగారు మెఱుఁగు, 36. ప్రశస్తరీతిన్=మిక్కిలి పొగడఁబడువిధముగా.

## భర్తృహరినీతిశతకము

పద్యము 2. నిగూఢగుప్తము=మిక్కిలి రహస్యముగా దాఁపఁబడినది. విశిష్టదైవతము=దేవునితోఁ గూడికొన్నది. 4. భూరిమయ+అంగదతారహారముల్=బంగారుమయమైన దండగడియములును, ముత్తెములపేటలును. 5. హర్త=హరించువాఁడు (దొంగ), అర్థి=యాచించువాఁడు. 6. సంసక్తిన్=(సంసారసంబంధమైన) ఆసక్తిచేత, జ్యాభర్త=భూపతి(రాజు), శ్రుతి=వేదము, అన్వయము=వంశము, శీలము=మంచినడవడి, ఉద్ధతి=గర్వము. 7. సూనృతవాణి=సత్యవాక్కు, అభివాదనము=పాదములను ముట్టి నమస్కరించుట. వీర్యము=పరాక్రమము, దోర్యుగంబు=బుజములజంట. 9. పరార్థప్రాపకుల్=ఇతరుల కార్యములను కూర్చు (పొందుపఱుచు) వారు, పరహితార్థవ్యాపృతుల్=ఇతరుల హితమునకుఁ బ్రయత్నించు వారు, ఘాతుకుల్=నాశము నొందించువారు. 11. హృదయ వచశ్శరీర

ముఁ౯=మనస్సుచేతను, మాటలచేతను, దేహము (చేష్టల) చేతను, 12. సంత్రస్తులు=మిక్కిలి భయమును బొందినవారు, విఘ్ననిహన్యమానులు=అంతరాయములచేత కొట్టఁబడినవారు, ధృతి+ఉన్నత+ఉత్సాహులు=ధైర్యముచేత నిడుపైన (అధికమైన) ప్రయత్నము గలవారు, ప్రారబ్ధార్థములు=ఆరంభింపఁబడినకార్యములు, ఉజ్జగింపరు=విడువరు. 13. నీతిశ్లాఘ్యపథంబు=నీతిచేఁ బొగడఁదగినమార్గమును. 14. గాలిమేపరిబోరవాతర్=సర్పరాజు నోటియందు, కేలు=చేయి, హుతాశన మధ్యపాతము=అగ్నినడుమపడుట, వర్జనము=విడుచుట. 15. వార్ధి=సముద్రము, కుల్య=కాలువ, కోపితఫణి=కోపమునొందినపాము, భీష్మ=భయంకరమైన, 16. అకుంఠవృత్తి=కపటము లేని వ్యాపారము. 17. దోసఁగులు=ఆపదలు, వీతనిజకర్మరంబులు=విడిచిపెట్టఁబడిన తమ తమ హద్దులు గలవి. 18. మకరముఖాంతరస్థము=మొసలినోటిలోపలనున్న, చలత్+ఊర్మి+కానీకరము=కదలుచుండు కెరటముల చాలు (సమూహము) మహోదధి=మహా(గొప్పదైన)సముద్రము. 19 తత్కవచాదులు=(అలంకారముకొఱకు ఉపయోగింపఁబడు) అయాచౌక్కాలు మొదలగునవి. 20. హ్రీరమ్యుఁ౯=సిగ్గుచే ఒప్పిదమైనవానిని, మాయుఁ౯=మాయగలవానిని, శ్రోత్రప్రియాలాపుఁ౯= చెవులకింపైన మాటలాడువానిని, వాచాలుఁ౯=వదరుఁబోతును, సుధీగుణము౯=బుద్ధిమంతుఁడైనవానియొక్క మంచిగుణమును, దురితాబాధంబుఁ౯=దోషముచేఁ బ్రసిద్ధికెక్కినదానినిగా.

దాశరథిశతకము

పద్యము 1. శ్రీరమణీయహార=కాంతిచే మనోహరమైనహారము (వనమాల)గలవాఁడా!, అతసీకుసుమ+ఆభ=శరీర=అవిసెపువ్వుకాంతివంటి కాంతిగల మేను గలవాఁడా ? భక్తమందార=భక్తులకు కల్పవృక్షమువంటివాఁడా ! వికారదూర=(కామక్రోధాది) వికారములకు దూరమైనవాఁడా ! (లేనివాఁడా ! యనుట). పరతత్త్వవిహార=కేవలము జ్ఞానమై విహరించువాఁడా ! త్రిలోకచేతనోద్ధార=ముల్లోకములయందు గల ప్రాణుల నుద్ధరించువాఁడా ! ఖరాదిదైత్యకాంతారకుఠార=ఖరుఁడు మొదలుగాఁ గల రాక్షసు లనియెడి అడవికిగొడ్డలివంటివాఁడా !

భారతనీతులు.

పద్యము 1. సత్యాకృతులు=సత్యమే ఆకారముగాఁ గలవి. గుణములు=మంచిగుణములు; నిత్య=ఎల్లప్పుడును, అనుష్ఠిత=ఆచరింపఁబడిన, సమగ్ర=పూర్ణమైన, నిర్మల=స్వచ్ఛమైన, యోగ=ధ్యానము మొదలగువానియొక్క, స్థితి=ఉనికికి, అభిముఖునకు=ఎదురుగ నుండువానికి (ఎల్లప్పుడును ధ్యానాదియోగములయందు ఉండువానికి) కార్యంబులు=చేయఁదగినపనులు. 14. ప్రజ్ఞ=బుద్ధి, ప్రతిష్ఠ=ప్రఖ్యాతి, నాకము=స్వర్గము, కైవల్యము=మోక్షము, 15. పథ్యము=ఇష్టమైనది, పరిమితము=కొంచెమైనది, అమోఘము=వ్యర్థముకానిది. 16. పథము=(నీతియైన)మార్గము. 17. సైరణ=ఓర్పు. 18. అధికదీర్ఘ=మిక్కిలి పొడుగైన, వైరవృత్తి=విరోధ వ్యాపారము.

---

